# సాహిత్యం ప్రజాసంపద ఏ ఒక్కరి వ్యక్తిగత ఆస్తి కాదు

ఆధునిక సాహిత్యంలో శేషేంద్ర ఒక సంచలనం. కవితా రంగంలో సుడిగాలిలా హోరెత్తించినవాడు. ఆయన కన్ను మూసిన తరువాత కూడా సంచలనానికి కేంద్రమయ్యాడు. వారి గ్రంథ హక్కుల వివాదం అంతటా ఉత్కంఠ రేకెత్తించింది. ఇటీవలే హైదరాబాద్‌లోని సిటీ సివిల్ కోర్టు తీర్పు ప్రకటించింది. శేషేంద్ర రచనల హక్కులు ఆయన కుమారుడు సాత్యకికే చెందుతాయని తీర్పు చెబుతూ అదే క్రమంలో ప్రత్యర్థి ఇందిరా ధన్‌రాజ్‌గిర్ నేర కోణాన్ని కూడా బహిర్గతం చేసింది.

ఈ నేపథ్యంలో సాత్యకితో ముఖాముఖి :

**ప్ర: ఈ వివాదం ఎలా మొదలైంది?**

జ: నేను ఊహించలేదు. నాన్న నాకు ఇచ్చిన కానుక నాకు తీవ్రమైన సక్షోభాన్ని, యాతనకు గురి చేస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. ఏదో ఒక దశలో ఆయన రచనలు మళ్ళీ అందరికీ అందుబాటులోకి తీసుకరావడానికి ఉపయోగపడుతుందని భావించాను. కానీ నాన్న అవసాన దశలో ఒక విషయం గ్రహించాను. ఆయన రచనలు ఒక వ్యక్తి అందులోనూ ఆయనకు తీరని అపకారం చేసిన వ్యక్తి తప్పుడు ప్రచారానికి దుర్వినియోగం కాకుండా అరికట్టడానికి ఉపయోగపడే అవకాశం కూడా ఉందని గ్రహించాను. నాన్న అస్తమించిన ఈ 11ఏళ్ళ కాలంలో ఈ రెండు కోణాలు ఎవరైనా చూడవచ్చు.

**ప్ర: అసలు ఇందిరా ధన్‌రాజ్‌గిర్ మీ ప్రత్యర్థి ఎలా అయింది?**

జ: ఇది ఆమె ఎంచుకున్న పాత్ర, పని. మా ఇద్దరిలో పునాది గతంగా ఉన్న వైరుధ్యం ఇది. నాన్న సాహిత్యం పునరుముద్రించి అందుబాటులోకి తేవాలన్నది నా లక్ష్యం. ఆయన సాహిత్యాన్ని తన పేరుతో అచ్చువేయించి ఆయన భార్యగా ప్రచారం చేసుకొని స్థిరపడాలన్నది ఆమె ఉబలాటం.

**ప్ర: ప్రచారం అని ఎందుకు అంటున్నారు?**

జ: మొదటి నుంచి ప్రతి పుస్తకంలో అంకితం అని ఒక ప్రత్యేక పేజి ఉండేది. అందులో వైఫ్, రాజకుమారి ఇందిరా దేవి ధన్‌రాజ్‌గిర్ అని ఉండేది. ఆమె పేరుతోనే మరెవరో రాసిన ముందుమాట కూడా ఉండేది. ఇది ప్రచారం కాక మరిఏమిటి? ఇప్పుడు ఆమె రోదన కూడా ఆయన రచనల కోసం కాదు. పుస్తకాల్లో ఈ ప్రత్యేక పేజి లేదనే. చరిత్రకు ఎక్కినవారు అజ్ఞాతంగా ఉండిపోయిన ఎందరో మహిళామణులు తమ భర్త గౌరవ మర్యాదలకోసం రాణింపు కోసం తమ జీవితాలను సంతోషంగా బలి ఇచ్చారు. కానీ ఎవరూ తమ గురించి ప్రచారం చేసుకోలేదు. ఈమె తన తండ్రి అస్తిలో వాటా కోసం మా నాన్న జీవితాన్ని సాహిత్యాన్ని బలి చేస్తున్నది. నాన్న చనిపోయిన కొద్ది రోజులకే "శేషేంద్ర శర్మ వారసులు ఎవరు?" వ్యాసంలో ఈ అంశాలని వివరంగా బహిర్గతం చేశారు. విజయబాబు గారు ఎడిటర్‌గా ఉన్న రోజుల్లో ఆంధ్రప్రభలో ఈ వ్యాసం ప్రచురితం అయింది.

**ప్ర: కోర్టు తీర్పులో బయటపడ్డ నేర కోణం ఏమిటి?**

జ: 2007లో తెలుగు యూనివర్సిటికి ఆరు లక్షలు ఇచ్చి నాన్న పుస్తకాలు అచ్చు వేయించే ప్రయత్నం చేసింది. కాపీ రైట్స్ నాన్న ఆమెకు రాసిచినట్లు ఒక పత్రం కూడా తెలుగు యూనివర్సిటికి సమర్పించింది. నేను లీగల్ నోటిస్ ఇచ్చేసరికి తెలుగు విశ్వవిద్యాలయం డబ్బు ఆ పత్రం ఆమెకు వాపస్ చేసింది. ఇదే పత్రం కోర్టుకు సమర్పించింది. ఆమె వత్తిడికి తట్టుకోలేక నాన్న నిజంగానే ఆమెకు రాసిచ్చాడని 11ఏళ్ళుగా అనుకుంటూ వచ్చాను. కానీ కోర్టు ఆ పత్రాన్ని తెలంగాణ ఫోరెన్సిక్ లేబరేటరీకి పంపించింది. ఆ పత్రాన్ని పరిశీలించి అది నకీలి పత్రం అని అందులో ఉన్న నాన్న సంతకం ఎక్కడినుంచో ఫోటో తీసి ఆ పత్రంలో చేర్చిందని ఫోరెన్సిక్ విభాగం వివరంగా నివేదిక సమర్పించింది. జడ్జి గారు కూడా తీర్పులో ఈ నివేదిక అంశాలలో వివరంగా ప్రస్తావించారు.

**ప్ర: ఈ మధ్య ఇందిరగారి తెలుగు ఇంటర్వ్యూలు వచ్చాయి. మీరు చూచారా?**

జ: చూచాను. ఆమెకు తెలుగు అక్షరాలు రావు. కనుక నిస్సందేహంగా ఆమె ఆస్థాన జాగిలాల వంటకం ఇది. ఇదీ వీటి పుట్టక. తెలుగు అక్షరాలు ఎరుగని 93ఏళ్ళ వృద్ధురాలు ఏకంగా తెలుగు పత్రికల సంపాదకుడినే ఆస్థాన జాగిలంగా పునర్జన్మ ఇచ్చింది. ఇదే ఆమె రజాకార్ చాతురీ మహత్మ్యం. పచ్చి అబద్ధాల మూటని పాఠకుడి నెత్తిన పెట్టటానికి కూడా ఒక హద్దు ఉంది. 1960లో ఒక కవి సమ్మేళనంలో అందులోనూ పీవీ నర్సింహారావు సమక్షంలో పరిచయం. ఎంత గొప్ప కల్పన! 1960 నుంచి 1965 వరకు నాన్న గూడురు, చిత్తూరు, ఒంగోలు, కడపల్లో మున్సిపల్ కమిషనర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. 1966లో బదిలీ అయి హైదరాబాద్‌కు వచ్చాడు. 1966కు పూర్వం ఉద్యోగ రీత్యా కానీ ఇతరత్రా కానీ హైదరాబాద్‌కి రానేలేదు. మరి ఆ కాలంలో ఆమె జీవితం ఏమిటి? విప్లవ కవి మగ్దుం మోహియుద్దీన్‌తో ప్రేమ గ్రంథం నడుపుతున్నది. ఆయన ప్రేమగజళ్ళు రాసారు. రోజుకొక్కటి రాసి ఆమెకు అంకితం ఇచ్చారు. ఆ డైరీ పాండులిపి నాకు చిక్కింది. 2005లో యథాతథంగా స్కాన్ చేసి "ఛుపా మగ్దుం" శీర్షికతో అచ్చువేసాను. ఆయన కుమారుడు నుస్రత్ మోహి యుద్దీన్‌తో పోలీస్ కేసు పెట్టించింది. ఐవాన్ ఏ ఉర్దు ఇదారా వారి సబ్‌రస్ సాహిత్య మాస పత్రికలో యాదే (జ్ఞాపకాలు) పేరుతో మగ్దుంతో తన ప్రేమ బాంధవ్యం నెమరువేసుకున్నది. తన 93వ ఏట ఫిబ్రవరి 2018లో హిందీ కవిత–మనీష్‌గుప్తా రూపొందించిన (యూట్యూబ్‌లో ఈ వీడియో చూడ వచ్చు) అరగంట వీడియోలో మగ్దుంతో తన బాంధవ్యాన్ని ఎంతో అర్ద్రంగా నెమరువేసుకున్నది.

**ప్ర: అసలు ఆమె ఇంటర్వ్యూల మీద మీకు అభ్యతరం ఏమిటి?**

జ: ఎలాంటి అభ్యతరమూ లేదు. ఒక ప్రముఖ కవి రచనల హక్కులు 10ఏళ్ళ తర్వాత కోర్టు తీర్పు చెప్పి అందులో నేరకోణాన్ని బయటపెట్టితే తీర్పు ముఖ్యాంశాలు ప్రచురణా రంగానికి సామాజానికి తెలయచేయాల్సిన ప్రాథమిక బాధ్యతను తుంగలో తొక్కి ప్రేమ కవిత్వం, ప్రేమ పెళ్లి రంగులు పులిమి సాహిత్య ముసుగులో ఒక ఇంటర్వ్యూ ప్రచురించడం ఎడిటర్ గారి జన్మ సంస్కార విశేషం.

**ప్ర: ఈ పాటియాలా యువరాజ్‌తో నిశ్చితార్థం ఏమిటి?**

జ: ఇది ఒక కాకరకాయ కట్టుకథ. నిజాం ప్రధాన మంత్రి మహరాజ కిషన్ ప్రషాద్ మేనల్లుడు శ్రీకిషన్ సేఠ్‌తో 1945లో ఆమె వివాహం జరిగింది. పెళ్లి రోజే ఆయనకు దేహశుద్ధి గావించి పారిపోయి వచ్చింది. ఇక అప్పటి నుంచి వివాహిత పురుషులను వెంబడించ ఆరంభించింది. దానికి మళ్లీ ప్రేమ కవిత్వం సాహిత్యం ముసుగు. ఇక పెద్దలు పీవీ. నర్సింహారావు జలగం వెంగళరావు 1960–66 మధ్య రాజధాని రాజకీయాల్లో అంత ప్రముఖులు కారు. 1967 ప్రాంతంలో పీవీ.విద్యామంత్రిగా ఉండేవారు. 1973–77 జలగం ముఖ్యమంత్రి. వీరు ఇద్దరూ అహర్నిశలూ ఇందిరాగాంధీ ప్రచారంలో పాదసేవలో భజనలో మునిగి తేలేవారు. ఇక మన ఇందిర వీధి నాటకానికి పౌరోహిత్యం వహించే ఆస్కారమే లేదు. భర్త ఉంటే తప్ప తన ఆస్తిలో వాటా దక్కదని తండ్రి వీలు నామాలో రాసేసరికి పెళ్లి అనే వీధి నాటకం ఆడింది. దీనికి ఎవరి ఆశీస్సులు లేవు. ఆమె తండ్రి ఇద్దరు తమ్ముళ్ళ వీళ్లిదరిని కాల్చేయాలని ఎప్పుడూ తుపాకులు పట్టుకొని తిరిగేవారు. ఈ రోజుకీ ఇదే పరిస్థితి ఇక నాన్న మానసికంగా శారీరకంగా చెప్పరాని చిత్రవధకు గురి అయ్యాడు. చివరికి 2007లో ట్రీట్‌మెంటు నిలిపివేసి కడతేర్చింది.

**ప్ర: చివరకు మీరు చెప్పేది ఏమిటి?**

జ: అనాదిగా సాహిత్యం శాస్త్రాలు సమస్త మేధోసంపద సమాజానిదే. ఇది చరిత్ర చెబుతున్న సత్యం. సాహిత్యం ప్రజాసంపద యావత్ సమాజానికి చెందిన సంపద. సాహిత్యం ప్రజలకే దక్కుతుంది. ఏ ఒక్కరి వ్యక్తిగత ఆస్తి కాదు.

–శుభశ్రీ సాహితీ